శ్రీశంకర భగవత్పాదకృత.

# ఆనందలహరి

అనువాదకుఁడు:

## సోమంచి వాసుదేవరావు



మొదటికూర్పు 500,

*Printed at the*

*Sri Rama Krishna Printing Works.*

Chicacole, (Vizag Dt)

 Rs. 0—6—0.

శ్రీరస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# ఉపోద్ఘాతము

విద్యలన్నిటిలో నుత్తమమయినవిద్య కవిత. దాని నెఱింగిన మహనీయుఁడు విశ్వమంతయు నెఱింగినవాఁడగును. అది ఋష్యంశ సంభూతునకుఁదక్కఁ దదితరులగు నెంతటిపండితులకైన నలవడదు. దీనికిఁ దార్కాణ మాదికావ్యమగు శ్రీమద్రామాయణము రచించిన మహాత్ముఁడు వాల్మీకిమహర్షి. భారతభాగవతాద్య ష్టాదశపురాణములు నిర్మించిన మహనీయుఁడుఁ వ్యాసమహర్షి మఱియు నిట్టి మహాభాగులింకెందఱో కలరు, కావుననే "నానృషిః కురుతే కావ్యం" అనివాక్రోనఁబడినది, అట్టి ఋష్యంశమున లబ్ధమగు సత్తమకవితను, నీతిబాహ్యమై కచకుచవర్ణనాకలితమై యపవర్గసౌఖ్యమును దూరము జేయున సత్కథాకావ్యకల్పనా శిల్పంబున వినియోగింపక దీనజన వత్సలుఁడగు సర్వేశుని పరమపవిత్ర చిత్రచరిత్రకీర్తనమున వినియోగించినచో నది కవికైహికాముష్మిక సుఖంబులఁజేకూర్చు అక్కారణముననే తొంటిమహాకవులెల్లరుఁ దమకవనమును బుణ్యగాథా భాసురకావ్యనిర్మాణముననే వినియోగించిగతించినను వారిప్పటికిని ధన్యజీవనులై యశశ్శరీరులై విరాజిల్లుచున్నవారలు

అట్టి ధన్యాత్ములలో నగ్రస్థానమలంకరించినవారు, పూజ్యపాదులగు శ్రీమచ్ఛంకరాచార్యులు ఆ జగద్గురులు లోకోపకారకములుగా ననంఖ్యాకములగు గ్రంథరాజములు గీర్వాణభాషలో రచించి సకలవిబుధ సంస్తోత్రపాత్రులై జగద్విశ్రాంతసమజ్ఞానులై కీర్తిశరీరులై వెలయుచున్నారలు ఆమ్మహామహాకృత మహాగ్రంథములలో, గీతాభాష్యము, సూత్రభాష్యము, భక్తిరసప్రధానములగు సౌందర్య శివానందలహరులు కరముఁ బేరెన్నికఁ గనియుండుట యెల్లరెఱింగిన విషయమేకదా? అందు సౌందర్యలహరి, జగజ్జననియగు శ్రీశాంకరీసౌందర్య సౌకుమార్యవిశేషములు, భక్తిరసోద్రేకముగ వర్ణింపఁబడినవి. ఈ శివానందలహరి, భక్తసులభుఁడగు నా

ఖండపరశుని చిత్రచరిత్రసంకీర్తనమున విరాజమానమై యప్రతిమానమై యలరారుచున్నయది. అట్టి యీ స్తవరాజములు, సంస్కృత భాషాపరిచితులకేకాని తదితరుల కెంతమాత్రమును బోధ్యములు కావయ్యెను.

అక్కారణమున భక్తవతంసుఁడగు శ్రీసోమంచి వాసుదేవరాయ కవిగారీ సౌందర్య శివానందలహరులు, నాతికఠిన నాతిసులభశైలిని సలక్షణమగు భాషలో ధారాళముగ నాంధ్రీకరించి యక్కొఱఁతదీర్చి యాంధ్రలోకమునకు మహోపకారముగావించి యాంధ్రభాషా పోషకమూల్యభూషలుగా నొసంగిరి. నేనీశివానందలహరి నామూలాగ్రముగఁ జదివితిని. ఆంధ్రీకరణమనితోపనీక యలరారుటంజేసి యిది సహృదయులసహృదయములఁ గరఁగింపఁగలదనినే నమ్ముచున్నాఁడను. రసోజ్జ్వలముగ మూలానుసరణముగ నాంధ్రీకరించుట అతికష్టము అది యాంధ్రీకరణలకేకాని తదితరులకుగోచరముకాదు. మఱియు నీకావ్యము తనపితృదేవాంకితముగుట నీసుకవి పితృభక్తి సౌశీల్యతాది గుణములఁ బ్రకటించుచున్నయది ఏరింతకుమున్నే సమీర సందేశాది స్వకపోల కల్పనాకల్పితకావ్యముల రచించి యాంధ్రలోకమునకుఁ గృతపరిచయులై యున్నారు. ఈసుకవివర్యుఁడు తన కవిత, నుత్తమగ్రంథ నిర్మాణమున వినియోగించి చరితార్థమొనర్చి ధన్యుఁడయ్యెను. విద్యాధికారులు, నాంధ్రపండితలోకమీ భక్తాగ్రణి మహోద్యమమునకుఁ గేలూఁతయొసఁగి యింకనిట్టి సద్గ్రంథముల రచింపని తనిఁ బ్రోత్సాహితులుగాక! భక్తవత్సలుఁడగు శ్రీ శశిఖండమౌళి యీ భక్తాగ్రేసరుసితో ధీసకలైశ్వర్యంబులం బ్రసాదించి నిరంతరమును కింపమైరక్షించుఁగాత!

ఇట్లు విన్నవించు,
విబుధ విధేయపరమాణువు,
గరిమెళ్ల వేంకట రామమూర్తి,
ఆంధ్రోపాధ్యాయుఁడు,
మునిసిపల్ హైస్కూల్.

శ్రీకాకుళము
24-12-1936

# విజ్ఞప్తి

నేను శివానందలహరి నాంధ్రీకరించి యించుమించుగా నాఱువత్సరము లయినది. కార్యాంతరాసక్తుఁడ నగుటచే దీనిని నింతదనుకఁ బ్రకటింపఁ జాలకుంటిని భక్తజనముల కత్యంతోపయుక్త మగుటచే దీని నిప్పటి కయినను బ్రకటించి ధన్యుఁడ నయితి. విద్వజ్జనములును గవివర్యులు నిందలి దోషములను మన్నింపఁ బ్రార్థితులు ఈ పొత్తమునకు దయతో నాంగ్లభాషలోఁ దొలిపలుకు వ్రాసి యిచ్చిన శ్రీ పణ్యాల బలరామస్వామి పంతులుగారికిఁ గృతజ్ఞతాభిపూర్వక వందనము లర్పించు చున్నాఁడను.

ఇట్లు సుజనవిధేయుఁడు,

టెక్కలి,

సోమంచి వాసుదేవరావు.

## Copy of Ganjam Collector's
L. Dis. 990/36 dated 3-2-1936.

Sub:—Books and Publications work by name 'Sivanandalahari' by clerk S. Vasudevarao—preface by Mr. P. Balaramaswami permission sought for.

Ref:—Tekkali Deputy Tahsildar's No. Nil dated 30-12-35 with the Chicacole Sub Collector's remarks.



No previous permission is required if the clerk S. Vasudevarao's literary pursuits are only of an occasional character, and are not to the detriment of Government work. He may publish the book which contains a translation in Telugu poems of "SIVANANDALAHARI" with the preface of the Deputy Tahsildar M. R. Ry., P. Balaramaswami to the book.

(By order)
Sd/ B. Ramamurty 4-2-36
HS for Collector.

(True copy)

## Preface.

1. The four great religions of the world viz Hinduism, Budhism, Christianity and Islam, all have a common basis and the same identical goal Intellectual and cultural co-operation among these four religions promoting a feeling of kinship and esprit-de-corps, can alone effectively exert sufficient influence among the mankind to work in harmony for the universal brother-hood of man, to reach the final goal from which there is no retrogression. Each religion has a plentiful crop of pearls and gems of divine wisdom. But the discor dant notes, at play only require to be harmonised, each to work at the proper time and at the proper place of the orchestra each to have its continuous play within the ambit like the countless millions of stars with their innumerable planets each revolving in its own orbit singing the glory of God, all in a harmonious tone Various Avatars (incarnations) prophets and sages, commissioned by the Almighty father visited different spots of this blessed earth at different periods and each had his own message to deliver to man for the glorification of the Lord and for the uplift of the humanity to a higher plane. Sree Sankara Acharya is one among them

2. The crown and glory of the Hindu monis-tic philosophy is Sree Sankaracharya. He is by far the supereme-excellance to whom there is no equal. He unfolded a philosophical system which remains to this day and remains for ever and on taking its deep hold even in Europe and America thus enshrining the whole globe. He incomparably stands far aloof from the others shedding his glorious lustre for whom there is no second. He is himself in the field. All the others pale away before him like flickering dim and smoky lamps before the meteoric resplendent white light dispelling darkness every where. The biography of Sree Sankara Acharya is too well known to be summarised..

3. The work of Sivanandalahari is a masterpiece prayer sung by Sree Sankara Acharya to the glory of the Lord Siva in a sublime style which can be realised only by eminent sanskrit scholars. Neverthless the lustre is so great that even the humble blind can inwardly feel the glow of light and break forth into out bursts of delight and praise the glory of the Lord while the visionaries are often struck blind by the dazzling flashes of the resplendent meteoric white light.

4. The above work has been, in its humble way translated into Telugu verse as a consecration of service to the Lord by one of his devotees S Vasudevarao a poet one of whose works was prescribed by the Andhra university for the intermediate, examination in Arts. I most humbly bow down with folded arms before the general pubblic and implore their mercy for this imprudent act of writing a preface to this grand work when I am not equal to the task. But as an humble devotee of the Lord, I felt it as a sort of duty incumbst on me when this task was more than once thrust on me despite rapeated confessions that I am not equal to the task.

5. The Lord Siva chosen in the prayeris not the sectarian prayer confining to the sectarian diety the Siva as understood by certain sections of the Hindu community. He is the universal Lord and the prayer is so sublime and so pure that it throws one beside himself into a rapturous joy singing the glory of God with melodious ecstacy, joining in the universal dance of the Sree Nataraja I fall prostrate before the Lord to purify me from my sins and transgressions.

Dated 3-9-35<br>Tekkali

P. Balaramaswami,<br>Deputy Tahildar,<br>Tekkali Taluk<br>Ganjam District

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శివానందలహరి

## పీఠిక

శా॥ వైదర్భీ హృదయారవిందరవి, భూ♦భారావనోదార్థదీ
క్షాదక్షుండు, ధరాసుతప్రముఖ♦సంరక్షైకదక్షీణ బా
హాదర్పాతిశయుండు, భక్తజనసం♦వ్యస్తాబ్జమాభీరికా
మోదాపాదకుఁడైనకృష్ణపరమా♦త్ముండిచ్చునిష్టార్థముల్

ఉ॥ శారదనీరదేందు ఘన♦సారసుధానిభమూర్తి భక్తమం
దారుఁడు పార్వతీశ్వరుఁడు♦దారుణపారస పూరపూరితే
ష్టారమణీయుఁడద్రిజా♦కల్పమహీజమనంతఘోర సం
సారమహాబ్ధితారకుఁడు♦సత్కృపనిచ్చుత మీకభీష్టముల్.

ఉ॥ ఆర్యజనాగ్రగణ్యుని శివా♦పరమూర్తిని భవ్యసాహితీ
ధుర్యుని వాఙ్మహానిలవి♦ధూతకుతర్కరజోనికాయు ధీ
వర్యుని నాస్తికప్రకర♦భంజను భక్తవరేణ్యుశంకరా
చార్యు,మదిందలంతు నని♦శంబు గురున్ మదభీష్టసిద్ధికై.

మ॥ జనసంస్తవనీయవర్తనుని రా♦జద్భూరి తేజున్ సుధీ
వనజాతాకర రాజహంసముఁ గలా♦పారంగతున్ జ్ఞానచ
క్షుని శ్రీరామపదారవింద భజనున్♦సోమంచి కోదండరా
ముని దైవజ్ఞవిభూషణంబునునహం♦బున్ గొల్తు భక్త్యున్నతిన్

క॥ హరి హర భేదంబెఱుఁగక
యిరువురను నిరంతరము సమారాధిత భక్తిన్
గరము భజియించు భక్తుల
గురుభక్తి సమశ్రితంబులొనరింతు మదిన్.

ఉ॥ అందముగాఁగ నిష్టవిబుధావళి నిట్లు మదిందలంచి చ
క్కందన మొప్పు భక్తిశతకం బెదియేఁ దెనిఁగింప నెంచు వం
తం దగఁ దోచె శంకరకృతంబును భక్తినిదానమా శివా
నందలహర్యభిఖ్యకృతి నాదగు పుణ్యవిశేషవాసనన్.

ఉ॥ ఆకమనీయ కావ్యమధురామృత ధారలు భక్తపాళికిన్
బ్రాకటరీతి నెప్పుడు సులభంబుగఁ గోర్లెఁగఁజేయుదున్
మధు
శ్రీకవితా విలాసలహరీకలితంబును యోగ్యమాతదాం
ద్రీరణంబు సంతతసుధీజన రంజన భాజనంబుగన్.

క॥ వినుతంబగు నీకృతిసుమ
మును సజ్జనకునకు సకలబుధజన సన్మా
న్యునకును రామయ బుధ నం
దనునకుఁ గోదండరామునకు నర్పింతున్.





# శివానందలహరి

చ॥ కలితకళాస్వరూపుల, నఖండ పరస్పరసత్తపఃఫలం
బుల నవచంద్రశేఖరుల భూరిశుభప్రతిపాదులన్ మనో
జలజచరిష్ణులన్ సుఖరసస్ఫురదాత్ములఁ బార్వతీమహే
శులఁగొలుతున్ నిరంతరము శుద్ధమనస్పురనీజ కర్ణికన్ .1

గీ॥ దేవ ! భవదీయ చరితాపగావిగళిత
మై యఘరజఃపటలము వాయంగఁ దొరఁగి
భవశిఖనడంచి బుద్ధికాలువలఁ బ్రాఁకి
నామదిమడుంగుఁ గను శివానందలహరి. 2

శా॥ ఆద్యున్ హృద్యుఁ బురారిఁ బన్నగలసద్ధారున్ ద్రినేత్రున్ ద్రయీ
వేద్యున్ గారుణికాగ్రగణ్యు శివునిన్ వేదండచర్మాంబరున్
విద్యోగాత్ముని సాంబు నిన్నశుపతిన్ శ్రీకంఠు సర్వాత్మునిన్
విద్యాకారు జటాధరున్ మృగధరున్ బ్రీతిన్ భజింతున్ మదిన్ 3

మ॥ భువిలో వేల్పులెందఱేఁగలరు శం ♦ భూ! క్షుద్రిల వ్వారలో
భవ! స్వప్నంబుననైన వారిఁగొలువన్ ♦ భావింపనంభోజనం
భవలక్ష్మీధవ దుర్లభంబయిన త్వ ♦ త్పాదాబ్జనంసేవ భ
క్తి విశేషంబెసలారఁజేయుమదిఁగా ♦ ంక్షింతుఁ భవానీపతీ. 4

చ॥ కవితనుగాని వైద్యమున ♦ గాని సనోహరగానసనాట్యస
ద్వివిధపురాణశాస్త్రవిత ♦ తిస్మృతిమంత్రముఖాదిసత్కళా
ప్రవణతగాని సేనెఱుఁగఁ ♦ బామరుఁడన్ నృపులెట్లు నన్నుఁ బ్రీ
తి వెలయఁ గాంతురో పశుప ♦ తీ! పశుతుల్యుని నోమునన్
గృపన్ 5

మ॥ ఘటమున్ మృత్తును రేణువహ్నిపొగయున్ ♦ గ్రావంబటంచున్
మఱిన్
బటముం దంతువటంచుఁ బల్కుచును గం ♦ ఠక్షోభముం
జేఁయు
ద్భట వైవస్వతుఁడోలునే? బుధ! వృథా ♦ తర్కంబులన్
మానియా
సటదార్యాధవపాదపద్మ భజనా ♦ నందంబు నొందంగదే 6

చ॥ మనము భవత్పదాబ్జముల ♦ మాటలు నీనుతులన్ గరంబులున్
వినుతసమర్చనంబునను ♦ వీనులు నీకథలాలకించుటన్
ఘనమని నీదుసంస్మృతిని ♦ గన్నులు తావకమూర్తిఁ
గాంచుచుం
దనితరవస్తుసంతతిఁగ ♦ నన్ మఱియేగతి నో మహేశ్వరా!. 7

ఉ॥ ముత్తెపుఁజిప్పలన్ రజత♦మున్ మృగతృష్ణను నీరుగా జులన్
సత్తగు కెంపులం గనిన♦చందమునన్ భవదన్యు నీశుఁ గాఁ
జిత్తజవైరి! బాలిశుఁడు♦సేవయొనర్చు నిరస్తమహేశుఁగా
జిత్తమునన్ రవంతయును♦జింతనొనర్పఁడు హీనబుద్ధియై. 8

శా॥ గౌరీనాథ! జడుండు పూలకువివే♦కంబేది గంభీరకా
సారంబుం గని చొచ్చు, ఘోరవిపినా♦శానిర్జనప్రాంతమున్
జేరుం, గొండలనెక్కునొక్కటి యయో♦ చిత్తాబ్జమర్పించి ని
న్నారాధించి సుఖించుటల్ వెఱుఁగఁడా♦ హా నాథ! యాశ్చర్యమా 9

చ॥ నిరతము తావకీనపద♦నీరజభక్తిసుఖోర్మికావిహా
రరతిమనంబు వొందినన♦రత్వ, మృగత్వ, పశుత్వ, కీటక
త్వ రమరదేవతాత్వ ఖగ♦తా ముఖజన్మములెవ్వి, గల్గినన్
హరా! భయమందసుంత జన♦నాదులతోఁ బని యేమి? శంకరా!. 10

మ॥ వటువై సన్ గృహమేధియైన యతిబరి♦వ్రాట్టైన నిస్సంగుఁడౌ
జటియైనన్ మఱియెవ్వఁడైన బరమే♦శా! యేమి యయ్యా? వేని హృ
త్పుటపంకేజము నీయధీనమయియొ♦ప్పున్ వాఁడె నీవాఁడ, త
చ్చటులాభీలభవంబు వాపుదువు ని♦చ్చల్ భక్తకల్పద్రుమా! 11

ఉ॥ కాననభూమినైన గిరి♦కందరసీమలనైన గేహమం
దైననునగ్నినైన వెలి♦నైనను నీళులనైన నిల్చినన్
దానఫలంబదేమొకో? స♦దాశివ! చిత్తము నీపదంబులం
దూని రమించువాఁడె శివ♦యోగి యతండె సుఖాత్ముఁడీశ్వరా! 12

మ॥ భవదీయాంచిత పాదపద్మయుగ సేవాసారముత్కృష్టసా
రవిహీనంబయి యొప్పు సంసరణపాశావారమందంధుఁడై
యవివేకంబున నీదుచుంటి; నను దేవా! ప్రోవు, నీకంటె నీ
భువి దీనావను లేరు లేరిఁక స్వయంభూ! నేనదీనాగ్రణిన్. 13

ఉ॥ దేవ! పరిభ్రంశవీవగుట దీనజనాళికి బంధుఁడీవు; దీ
నావళి నగ్రగణ్యుఁడఁగదా మనచుట్టరికంబు సెప్పనే
లా? విబుధోత్తమా! యికమనాచరితాఖిలదుష్కృతంబులన్
నీవు క్షమించి ప్రోచుటకు నెక్కొనవే యిఁక బంధురీతిగా! 14

ఉ॥ దేవ యుపేక్షగాక భవదీయఘనస్మృతి దూరమున్ దురా
శావసథంబునై పరగు నవ్విధివ్రాత హరింపఁజాలునో
యావిధి పెందలన్ ఖరనఖాగ్రముచే నవలీలఁద్రుంపనే
యీవిధికీవ శక్తుఁడని యెంత మయోనదియుంబొనంగునే. 15

మ॥ శివ! నా యాస్యమునందు దైన్యమును వ్రాసెన్ బ్రహ్మ దానం జుమీ
భవమున్ దుష్కృపకేను బాతుఁడను, దేవా! యాగతిన్ బ్రహ్మనాఁ
త, విశేషంబుగల గ్గోర్చు వ గృహార్ద్రింబై నసీమాడ్కి నా
గ్రవు శేషించిన నాల్గుమోములను రక్షన్ జేయుఁగాకెప్పుడున్. 16

శా॥ స్వామీ! మత్కృతపుణ్యలాభమునహో త్వత్కృపాస్ఫూర్తినో

నామీఁదంగను నీవు ప్రసన్నతయు నానావంబయ్యె నైనన్ భవ
చ్ఛ్రీమత్పాదయుగంబు గోచరముత్ర ♦ సేవాసమానన్న నా
నామర్త్యాళిసువర్ణమౌళి తతిచే ♦ నాచ్ఛాదితంబై కదున్ 17

ఉ॥ శంకర! మోక్షమిచ్చుటకు ♦ శక్తుఁడవౌ కడవీవ యేలనన్
బంకజలోచనాదులును ♦ భవ్యపదంబులు నీకృపం గదా
పొంక మెలర్పఁగాంచిరి వి♦భుండవు నీకృప కేది మేర నీ
కింకరు నన్ను నెత్తుటకె ♦ కిల్బిషమానసుఁ జేసి పోచెదో. 18

శా॥ స్వామీ! దుర్మదభూమిపాలకగృహ ♦ ద్వారప్రవేశప్రత
ల్పామేయంబు దురంతముత్కటము రా ♦ కీర్ణముగ్రవ్యథో
ద్దామంబై చను సంసృతిన్ దిరుగు నా ♦ తాపంబుఁ జల్లార్ప వే
మీ? మాద్యత్కృపఁ జూచెదో విధిని న ♦ ట్లైనన్
కృతార్థుండఁగా. 19

శా॥ శర్వా! మోహవనిం జరించు యువతీ ♦ సమ్యక్కుచోత్తుంగశై
లోర్వింబాటియు భీష్టశాఖల మహా ♦ ద్యోగంబు నందారితాఁ
బర్వన్ వ్రాల్కపి భక్తిపాశమున నో ♦ ప్పన్ దాని వేకట్టినీ
గుర్వాదేశము నందునుంపఁగదె భి ♦ క్షూ! శైలజావల్లభా! 20

శా॥ స్థైర్యస్తంభక సంభృతంబు గుణబ ♦ ద్ధంబంచిత శ్రీకళా
ధుర్యంబున్ ఋజుమార్గసంఘటితముం ♦ జోరంబు శుద్ధంబునై
యార్యాశ్లేషితదేహ! చిత్తపటగే ♦ హంబౌ వృషద్దానిలో
నార్యాయుక్తుఁడవై వసియింపఁగదె సా ♦ ధ్యశ్రీవిలా
సంబునన్ 21

ఉ॥ మానసమోహదుర్వ్యసన◆మాహరణేచ్ఛ వహించి దాని కె
న్నని యుపాయముల్ గనియు◆హీనుల యిండ్లఁ బరిభ్రమించెదన్
వానిసహింప నెట్లగు స◆ర్వాఘహరా! యలసత్కరుణన్ స్వకీ
యానుమతిప్రవర్తిగ, ద◆యానయశస్కరనాథ! చేయవే? 22

ఉ॥ నీపద పద్మపూజలను◆నిత్యముసేయుము దానికిన్ ఫలం
బో పరమేశ! బ్రహ్మపద◆మో యలవిష్ణుపదంబొ యీయరా
దీపమునాల్గులోకముల◆దేఁజరిలుంపఁగ నేరహంసఁగా
నో పెనుపందిగానో సుమనోవర! నిత్యసుఖంబుఁగూర్పవే? 23

మ॥ అలకైలాసమునన్ సువర్ణమణిసౌ◆ధాగ్రంబునన్ సద్గణం
బులుగొల్వన్ సతిసేవసేయఁగ సుఖం◆బున్ బొందు దేవేశుము◆
గలమూర్ధాంజలినై నమస్కృతులు◆వేడ్కన్ జేసి యోహాంబ! యో
లలితానాథ యటంచుఁబన్నభవక◆ల్పంబుల్ నిమేషంబులై
చెలువారంగడపంగనెప్పుడగునో◆శ్రీకంఠ సమ్యక్కృపన్. 24

మ॥ జలజభవాదిదేవతల◆సన్నుతిపాఠములొప్పఁగా మహ
ర్షుల జయశబ్దముల్ చెలఁగ◆రుద్రగణాంబుల కేళిసాళి యొ
ప్పులలి ముదంబునొందు వృష◆భంబున నెక్కిన నీలకంఠు న
జ్జ్వల మృగధారు భస్మవిల◆సన్మృదుదేహునిఁ జూచు
టెన్నఁడో ? 25

ఉ॥ శ్రీకర ! త్వత్పదంచిత కు◆శేశయయుగ్మముఁ జేరి చేతులన్
జేకొని వక్షమందుఁదల◆నేత్రయుగంబున నద్దుకొంచుఁ ద

త్వాత్రికట సౌఖ్యంబుఁగొని♦పద్మభవాదులకైన దుర్లభం
బై కొమరారునిస్తులసు♦ఖానుభవంబును గాంచు టెన్నఁడో? 26

చ॥ కరమున హేమభూధ్రమెస♦గన్ ధననాథుఁడు క్రేవనుండఁగా
సురమణి కామధేనుసుర♦సుందరభూజములింటనుండఁగా
శిరమునశీతభానుఁడు వ♦సింపసమస్తశుభంబులంఘ్రులన్
బరగఁగ నీకభీష్టతమ♦వస్తువులెయ్యవి? యిత్తుఁజిత్తమున్ 27

శా॥ సారూప్యంబు భవత్సపర్యనమునన్♦సామీప్యమున్ సంస్తుతిన్
సారోదారుల భక్తులందవులుటల్♦సాలోక్యమున్ సత్కృపా
ధారా! సర్వచరాచరాత్మకతను♦ధ్యానాన సాయుజ్యమున్
గౌరీనాథ! యొసంగితీజనిన యిం♦కన్నేఁగృతార్థుండఁగా 28

శా॥ నీపాదాంబుజ పూజసేయుము మదిన్♦నిత్యంబు నిన్నెంతు దే
వా! పాలింపుమటంచు నీశరణము♦న్వాంఛింతు యాచింతునా
లాపంబుల్ భవదర్పితంబుగఁగృపా♦లక్ష్యోరుదృగ్జాలముల్
నాపైఁజూపు భవంబువాపుము చిదా♦నందోపదేశంబునన్ 29

మ॥ వపనోద్ధూతవిధిన్ సహస్రకరతన్♦బత్పూజలన్ విష్ణుతన్
లసదంచన్మృదుగంధలేపమున లీ♦లన్ సన్మరుత్త్వంబు: పా
కసమృద్ధిన్ దివిజాధినాయకతవీఁ♦కన్ బాత్రసమ్మార్జనా
దిసమంచద్విధులన్విధిత్వముని బొం♦దింపఁగనౌఁగాని, నే
నసమర్థుండను దాదృశార్చనలఁజే♦యంజంద్రచూడామణీ! 30

మ॥ కనదగ్నిస్ఫుటవిస్ఫులింగమయిలో♦కత్రాసదంబై యమ
ర్త్యనిగాయోగ్రపలాయనౌషధమునౌ♦హాలాహలంబున్ గళం

బున సంధించియుమిన్నంగఁ బోకుమియకో భూతేశ! కుక్షిస్థ భూ
తనివేశా వనముం బొనర్పుటయయాఁ దారార్ణనీశక్తికిన్ 31

శా॥ కీలాభీలము దేవతాభయద మహాక్ష్వేళంబుఁ గన్నారనీ
వేలీలన్ బొడఁగాంచి మించితటుగా కేరీతిఁ జేకొంటి శ్రీ
జాలా! నేరెడుపండొకో? రసనచే చాదంబునం జేర్చి త
య్యా! లీలం గళమందమర్చితివి దేవా! నీలమో చెప్పుమా! 32

మ॥ నతియైనన్ నుతియైనఁ బూజయయినన్ సత్కీర్తనం బైన న
మ్మృతియైనన్ శ్రవణంబయైన మతిసద్ధ్యానైక్యనీ కెప్పుడ
ర్పితమౌ నద్దియ ముక్తి: ముక్తియన వేఱేలేదు గౌరీపతీ!
యతిలోకా! పరదేవతాను సరణాయాసంబు లేలాయికన్. 32

ఉ॥ శంకర! తావకీన ఘనసాహసమేమని చెప్పనౌను నీ
బింకము నీకు సంస్థితియుఁ బెంపును నేరికి లేవు మారులుం
జంకఁగ దేవతల్ భయమునన్ బరువెత్తలయావధిన్ నిరా
తంకుఁడవై యొకంత వెరవా విహరించెదు పార్వతీశ్వరా! 34

శా॥ యోగక్షేమధురంధరుండు శుభదోద్యోగుండు సర్వజ్ఞుఁడున్
రాగద్వేషవిహీనుఁడంచు బహిరంతర్వ్యాపకుండున్ గృపా
భోగుండున్ బరమాంతరంగుఁడును జిత్పూర్ణుఁడటంచున్ నినున్
యోగేశేశ! తలంతుమద్ధితుఁడవై యుండంగదే శంకరా! 35

ఉ॥ దేహగృహంబునో పశుపతీ! కడుశుద్ధియొనర్చి మానసో
ద్వాహముసేయ భక్తిగుణబద్ధము ముజ్జ్వలపూర్ణమౌ మనో
మోహనకుంభమందునుతు పొల్పగు నీయడుగుం జిగుళ్ళఁ బు
ణ్యాహమొనర్తుఁ దారకసమంచిత మంత్రకమున్ బఠించుచున్ 36

సుమనస్సంఘముభక్తిరజ్జుయుత హృ◆చ్ఛుభ్రోరుమంథానముం
దమిమైఁగైకొని వేదవార్ధిఁదఱువన్◆దారంతఁజింతామణిన్
సుమనః పాదముఁ సుపర్వసురభిన్◆సోముఁ సుఖశ్రీకర
కల్పిమపీయూషమునైన యీశ్వరుని శ్రీ◆కంఠుఁ దగఁ బొందరే

మేచకచిహ్ను శంకరు న◆మేయుఁబ్రసన్న మృగాంకుఁబూర్వపు
ణ్యాచలమార్గదర్శిత సు◆ధాంశుని సద్గణసేవితుఁ దమో
మోచకు సోమునిన్ హృదయ◆పుష్కరరంగము దాల్చె నేని జ
ద్వీచి విశాలసౌఖ్యవన◆ధిన్ విహరింతురు పండితాగ్రిణుల్ 38

మాన్యుఁడు రాజశేఖరుఁడు◆మానస పద్మపురంబునందు సౌ
జన్యయుతనేకనాథుఁడయి◆సత్పరిపాలకుఁ డయ్యెఁగాన స
న్యోన్యత ధర్మమూర్తి చతు◆రంఘ్రుల సాఁగెనుఁ బాపమేగు షా
డ్గుణ్యవినాశముం గలిగె◆దున్ మఱిఁగాలము మేలగుం సుధీ
జన్యకళామహౌషధులు◆సత్ఫలదంబులు నయ్యెడుం గదా 39

మేధాయంత్రమునన్ వచోఘటముచే◆మేలౌ కవిత్వోపకు
ల్యాధారంబున వచ్చుత్వావక చరి◆త్రాంభోధినీరంబు హృ
త్కేదారంబున భక్తిసస్యముల నిం◆కేఁబెంపుఁజేయుం గిరీ
శా! దుర్భిక్షభయంబు లేదిఁక రమా◆సౌభాగ్యముల్ గల్గెడున్ 40

నానా పాపవిమోచనంబున కనం◆త శ్రీకళావాప్తికిన్
ధ్యానస్తోత్రనతిప్రదక్షిణ నమ◆స్కార్యాలోకనాకర్ణనా
ధీనస్వాంతవచశ్శిరోంఘ్రికరసం◆ద్వీక్షాశ్రవస్సన్నిమి
త్తానూనస్థితిఁ గల్గఁజేయుము కృపా◆వ్యాపార పారంగతా! 42

మ॥ ఘనగాంభీర్యమగడ్తగా ధృతియు ప్రాకారంబుగా సద్గుణా
ళినలిఁ సైన్యముగాన వేంద్రియములో◆లిన్ ద్వారముల్ గాఁగళల్
ధనముఖ్యాఖిలవస్తుసంతతిగ నా◆థా! మన్మనో దుర్గమొం
దును బొల్పారును దానినుండఁగదె యో◆ సర్గాధినాథా! శివా! 42

మ॥ ఘనవిస్తీర్ణతఁబొల్చు మామక మనః◆కాంతార సీమాంతరం
బున మాత్సర్యముఖోగ్రజంతుతతి యా◆మోదంబునఁ గ్రుమ్ముచున్
చనుసుమ్మాదికిరాత! నీవు మృగయా◆నానావినోదంబులం
గనుమద్దానిని జంపి యిట్టటుసనం◆గా నేలొకో యీశ్వరా! 43

మ॥ కరలగ్నోరుమృగుఁ గరీంద్రహరు వ్యాఘ్రచ్ఛేదిచర్మాకృతిఁ
గిరిశుం జంతుహరున్ జగద్విలయునిన్◆ శ్రీకంఠుఁ బంచాననుఁ
నిరతంబున్ మదసంతమానసగుహా◆న్నేఁదాల్చియుండంగనా
కరయుఁ భీతివహించెక్కి చిత్తమునధై◆ర్యశ్రీవిడంబించెడుఁ 44

శా॥ వేదక్ష్మాజశిఖాన్విత ద్విజసము◆ద్వేలంబు నిత్యంబుగా
మోదాపాదముఖేదభేదము సుధా◆పుంజీభవత్సత్ఫలం
బై దీపించు నుమేశు పద్యుగకలా◆యంబుఁ విహారస్థలిం
గాఁదోడ్తోనొనరింతు మానసవిహం◆గా! పోకు మాడాడకుఁ 45

చ॥ వరనఖరాజికాంతి విభ◆వస్ఫుటముఁ శశిచంద్రికాసుధో
త్కరమును బద్మరాగలలి◆తంబును హంసచయాశ్రితంబునై
పరమశివాంఘ్రి సౌధమున◆భక్తివధూసహితంబవై నిరం
తరము యథేష్టలీలల నొ◆నర్పుము మానసరాజహంసమా! 46

మ॥ గిరిశధ్యాన వసంతమందెసఁగె హృ◆త్క్రీడావనంబాదఘో
త్కర జీర్ణచ్ఛదపాళిభక్తిలతికా◆కాండంబు పుణ్యప్రవా

శరుచుల్ సద్గుణకోరకంబులు వరా◆లాపప్రసూనంబులున్
సరవిన్ జ్ఞానసుధామరందలహరుల్◆సంవిత్ఫలాభ్యున్నతుల్ 47

శా॥ సత్యానందరసాలయంబు సుమన◆స్స్వాంతాంబుజాతాశ్రయం
బత్యంతాచ్ఛము సద్విజార్చితమఘ◆వ్యాఘాతముఁ వాసనా
భూత్యాకీర్ణము శంకరస్మృతిశర◆త్సారంబు నద్దానిలో
నిత్యంబుండు మనోమరాళమ! వృథా◆నృత్యశ్రమం బేటికిఁ 48

శా॥ ఆనందామృత పూరితంబయి శివాం◆ఘ్ర్యబ్జాలవాలోద్యతం
బై నైశ్చల్యవసత్యుపఘ్నమయి భ◆క్త్యంచల్లతాపాళి యెం
తే సత్స్వాహ్యదికాయమానపటలిఁ◆దీపించు శాఖోపశా
ఖానూనంబగు దూరమై యుదిఫలా◆వాప్తిన్విడంబించుతఁ 49

శా॥ సాయంకాలవిజృంభితంబు, శ్రుతిశీ◆ర్షస్థానసంవాసి; సు
శ్రీయుక్తభ్రమరాభిరామము, సకృ◆చ్ఛిద్వాసనాశోభి, శ్రీ
భూయిష్టంబు, రుభోగిభూష, సుమనః◆పూజ్యంబు, మాశ్లేషిప్రా
లేయశ్రీగిరిమల్లికార్జునమహా◆లింగంబు సేవించెదఁ. 50

శా॥ భృంగీచ్ఛానటనోత్కటుఁ గరిమద◆శ్రీచోరునిఁ మాధవా
భంగాహ్లాదము మహాసితాకృతిని శు◆భస్పంచబాణాదృతిన్
రంగచ్ఛ్రీసుమనోవనుఁ ఘనమనో◆రాజీవరంగంబునం
దుంగొల్తుఁ భ్రమరాధిపాఖ్యుని సనా◆మున్ శ్రీధరావాసునిన్ 51

శా॥ కారుణ్యామృత వర్షి ఖండిత విప◆ద్గాఢోగ్రతాపుఁ మహా
ధీరుఁ సజ్జనసేవితుఁ ఫలితస◆ద్విద్యాకళాసస్య ని
చ్ఛారూపుఁ ఘనభక్తకేకినటనుఁ◆త్వామ్రభ్యన్నివాసుఁ జటా
ధారున్ మానసచాతకంబది సము◆ద్యత్ప్రీతి నిన్ గోరెడుఁ 52

శా॥ శ్రీమద్వ్యోమశిఖర్ మహాగిరిఫణిహా♦రిర్ బ్రహ్మశబ్దోప దే
శామేయారవకేకినాగమశిఖో♦ద్యానోత్కసంచారిసర్
శ్యామత్వాంధరజాబ్దనీలరుచి ప♦ర్యాలోకనామోది సు
స్థేమశ్రీభవనీలకంఠము మదిం♦జింతింతునశ్రాంతముర్. 53

మ॥ ఘనకాలంబుగనంజ, శ్రీహరి కరా♦ఘాతప్రభూతానక
ధ్వనియే వారిదగర్జగా, సురదృగం♦త శ్రీలుసౌదామినీ
వనిగా, భక్తముదశ్రుధారలు మహా♦వర్షంబుగాఁబార్వతీ
వనజాతాక్షిమయూరిగాఁదనరునె♦వ్వండామహాతాండవా
భినయశ్రీనిధిఁగొల్తు సంతతము నీ♦విర్ నీలకంఠేశ్వరుర్. 54

శా॥ ఆద్యుండప్రతిమానతేజుఁడుపురి♦వ్యాహారవేద్యుండు స
ద్విద్యానందమయాత్మకుండుతి జగ♦న్నిత్యావనోద్యోగియున్
సద్యోగీంద్రమనోగ్రహుండుదివిష♦త్సంస్తూయమానుండుమా
యాద్యున్యుండుజటాధరుండుశ్రుతిలీ♦లాహ్లాదియిచ్చున్ సిరుల్

శా॥ నిత్యుండున్ ద్రిగుణాత్ముఁడు ద్రుతపురా♦రాతుండు సుశ్లోకుఁడున్
శాత్యాయస్యధినాయకుండుమునివా♦క్సమోత్రరుచిమూర్తి
యున్.
సత్యుండాదికుటుంబి యాదిజటియా♦మ్నాయాంతసంచారియుర్

భూత్యుత్తుండును నృత్యసంభ్రముఁడుఁశం♦భుండిచ్చునిష్టార్థముల్

శా॥ దేవా!స్వోదర పోషణార్థము యి♦ర్థిన్నేను శ్రీమంత దు
ర్సేవాలోలుఁడనై చరింతును భవ♦త్సేవర్ మెలంగర్ జనుం
డై వర్తింతునుమత్పురాచరిత పు♦ణ్యశ్రీవిశేషంబునన్
భావంబందు వసింతువల్లగుటఁగా♦వన్ రావెసర్వాంతరా 57

మ॥ భవ! పద్మాప్తుఁడొకండయుక్షితినభో ♦ వ్యాప్తాంధకారంబు ద్రో
చి వెసన్ లోచనగోచరుండగుఁ గదా ♦ శ్రీకంఠ నీవన్నఁ గో
టివివస్వంత సహప్రభాయుతుఁడవై ♦ రివిఁకా బ్రకాశింతు నా
యవివేకోగ్రతమంబుఁబాపి తగఁబ్ర♦త్యక్షంబుగా వేశివా! 58

మ॥ విలసత్పద్మవనిన్ మరాళమును బ్రా♦వృణ్మేఘమున్ జాతకం
-బులు పద్మప్రియుఁ జక్రసంతతి శర♦త్పూర్ణేందుఁ జందాతపం
బుల నిత్యంబుఁ జకోరపాళి యెటు ప్రా♦పుంగోరు నారీతిఁ గే
వలసౌఖ్యప్రదతావకీన చరణా♦బ్జంబెంచుఁ జిత్తంబొగిన్. 59

మ॥ వణఁకన్ బోయెదు వాఁడుతీరముఖమున్ ♦ శాంధుండునీడన్ భయం
కర వర్షాచకితుండు గేహమును నీఁ♦కన్ సత్ప్రభుప్నిర్ఘమం
డరయంజీకటిఁ గుందుమానవుఁడు న♦త్యంతంబు దీపంబునే
నరణింగోరునో యట్లుగోరెదమహే♦శశ్రీపదాంభోజముల్ 60

మ॥ నిజబీజావళి యూడుగున్, నదియు ము♦న్నిటిన్ లతల్ చెట్టుఁ న
క్కుజమూరన్ సతినాథుసూదియునయ♦స్కాంతోపలంబెట్లుపొం
దఁజనుందద్గతిఁ గల్మషాపహాభవ♦త్పాదారవిందద్వయీ
భజనంబున్ మదిపొందభక్తియనఁజె♦ప్పంజెల్లుభూమండలిన్ 61

చ॥ శివ! ముదఖండబాష్పములఁ ♦ చేఁబులకంబులు గల్గఁజేయు శౌ
చవిధినారతంబుఁదగు ♦ ఛాదనముం బొనరించు సాగ్గర
ప్రవరమునన్ గథామృత ప♦రంపరఁగ్రోలఁగనిచ్చు భూతిర
క్షవొనరఁజేయు ధ్యానసుఖ♦శయ్యను బండఁగఁజేయు భక్తిమా
త వివిధభక్తలోక శిశు♦తా జనపాళికభీష్టదాతయై 62

చ॥ చినిఁగిన ప్రాఁతచెప్పు శశి♦శేఖరుబొమ్మలఁజేరెఁ బుక్కిలిం
చిన యుదకంబు సాంబునభి♦షేచనమయ్యెను భక్తముక్తమై

తనరిన మాంసముగ్గడ విందారి నివేదనమయ్యె భక్తుఁడై
వనచరుఁడొప్పెఁ జిత్రతర భక్తియు నేమియొనర్పదిమ్మహిన్ 63

మ॥ రవిజోరఃఫలకప్రతాడనము ఘోరంబౌనపస్మార భూ
తవినాశంబు నమత్సురావళి మహోద్యన్మౌళి సంఘర్షణం
బవనీభృద్వరభవ్యపర్యటనముల్ సాంబా! భవత్పాదుకా
వ్యవహారంబులు హీరపాదుకలుగా నస్మనంబెప్డుఁగో
ల్చు విహారంబొనరింపవే ఘనకృపాలోలా! భవానీ పతీ! 64

ఉ॥ ఏనరవర్యుఁడెప్పుడు మహేశపదాంబుజ సేవసేయు నె
వ్వానినిఁగాంచి దండిరిజ వక్షముఁ దన్నునటంచు నెమ్మదిన్
గ్లానివహించు వాని పదకంజములంగని దేవతావళుల్
మానితమౌళి రత్నచయలాలితకాంతులఁ బూజసేయు న
వ్వానిని ముక్తికాంతవర భావమునన్ సుఖఁజేయు నిచ్చలున్

శా॥ లీలార్థంబుగ నీవు సర్వజగముల్ నిర్మింతు తన్మానవుల్
లీలామాత్రమ్ము గాళి: యట్టికృత్యముల్ నేఁజేసినన్ నీకొగిన్
హాళింగూరుచుఁగాన నీవు కరుణాపాంగేక్షుః శ్రీ ననున్
బ్రోలే యాచలకన్యకారమణ! కర్తవ్యంబు పాలింపఁగన్ 66

క॥ నానానందాశ్రుజలా, మానస్ఫుట పులకలక్షితోద్యద్భోగ
స్థానము ముముక్షుసేవ్యా, బైనగడెత్తు శైవభక్తి నారాధింతున్

క॥ అమిత ముదమృతస్థానం, బమలభవత్పాదగోష్ఠమందెందు నెసం
గుమదీయభక్తిధేనువు, నుమహేశా! పశుపతీక సంగోనుముక్తపన్

శరుచుల్ సద్గుణకోరకంబులు వరా♦లాపప్రసూనంబులున్
సరవిన్ జ్ఞానసుధామరందలహరుల్♦సంవిత్ఫలాభ్యున్నతుల్ 47

శా॥ సత్యానందరసాలయంబు సుమన♦స్స్వాంతాంబుజాతాశ్రయం
బత్యంతాచ్ఛము సద్ద్విజార్చితమఘ♦వ్యాఘాతముఁ వాసనా
భూత్యాకీర్ణము శంకరస్మృతిశర♦త్పూరంబు నద్దానిలో
నిత్యంబుండు మనోమరాళమ! వృథా♦నృత్యశ్రమం బేటికిఁ 48

శా॥ ఆనందామృత పూరితంబయి శివాం♦ఘ్య్రబ్జాలవాలోద్గతం
బై నైశ్చల్యనసత్త్వపఘ్నమయి భ♦క్త్యాచల్లతాపాళి యొం
తేసత్స్వాహ్వాదికాయమానపటలిన్♦దీపించు శాఖోపశా
ఖానూనంబఘదూరమై యది ఫలా♦వాప్తిన్ విడంబించుతఁ 49

శా॥ సాయంకాలవిజృంభితంబు, శ్రుతిశీ♦ర్షస్థానసంవాసి; సు
శ్రీయుక్తభ్రమరాభిరామము, సకృ♦చ్ఛిద్వాసనా శోభి, శ్రీ
భూయిష్టంబు, రుభోగిభూష, సుమనః♦పూజ్యంబు, మాశ్లేషిప్రా
లేయ శ్రీగిరిమల్లికార్జునమహా♦లింగంబు సేవించెదఁ. 50

శా॥ భృంగీచ్ఛానటనోత్కటుఁ గరిమద♦శ్రీచోరునిఁ మాధవా
భంగాహ్లాదు మహాసితాకృతిని శు♦భస్పంచబాణాదృతిన్
రంగచ్ఛ్రీసుమనో వనుఁ ఘనమనో♦రాజీవరంగంబునం
దుంగొల్తుఁ భ్రమరాధివాఘుని సనా♦మన్ శ్రీధరావాసునిన్ 51

శా॥ కారుణ్యామృత వర్షి ఖండిత విప♦ద్గాఢోగ్రతాపుఁ మహా
ధీరుఁ సజ్జనసేవితుఁ ఫలితస♦ద్విద్యాకళాసస్యని
చ్ఛాయాపుఁ ఘనభక్తకేకినటనుఁ♦క్ష్మాభృన్నివాసుఁ జటా
ధారున్ మానసచాతకంబది సము♦ద్యత్ప్రీతి నిన్ గోరెడుఁ 52

శా॥ శ్రీమద్వ్యోమశిఖిన్ మహాగ్రిఫణిహారస్ఫారబ్రహ్మశబ్దోప దే
శామేయారవకేకినాగమశిఖా[illegible]సంచారిసన్
శ్యామశ్రీమద్ధరజాబ్దనీలరుచి ప్రాప్త్యాలోకనామోది సు
స్థేమశ్రీభవనీలకంఠము మదిం జింతింతు నశ్రాంతమున్. 53

మ॥ ఘనకాలంబుగ సంజ, శ్రీహరి కరాఘాతప్రభూతానక
ధ్వనియే వారిదగర్జగా, సురదృగంత శ్రీలు సౌదామినీ
వనిగా, భక్తముదశ్రుధారలు మహావర్షంబుగాఁ బార్వతీ
వనజాతాక్షి మయూరిగాఁ దనరు నవ్వం డా మహాతాండవా
భినయశ్రీనిధిఁ గొల్తు సంతతము ధీవిన్ నీలకంఠేశ్వరున్. 54

శా॥ ఆద్యుండప్రతిమానతేజుఁడు శ్రుతివ్యాహారవేద్యుండు స
ద్విద్యానందమయాత్మకుండు త్రిజగత్స్థిత్యావనోద్యోగియున్
సద్యోగీంద్రమనోగ్రహుండు దివిషత్సంస్తూయమానుండు మా
యాద్యస్పృశ్యుండు జటాధరుండు శ్రుతిలీలాహ్లాదియిచ్చున్ సిరుల్

శా॥ నిత్యుండున్ ద్రిగుణాత్ముఁడు ద్ధుతపురానీకుండు సుశ్లోకుఁడున్
కాత్యాయన్యధినాయకుండు మునిహృత్సంమోహిరుచిమూర్తి
యున్.
సత్యుండాదికుటుంబి యాదిజటియామ్నాయాంతసంచారియున్

భూత్యుత్కృష్టుండును నృత్యసంభ్రముఁడుఁ శంభుండిచ్చు నిష్టార్థముల్

శా॥ దేవా! స్వోదర పోషణార్థము యాచ్ఞన్ నేను శ్రీమంత దు
స్సేవాలోలుఁడనై చరింతును భవత్సేవన్ మెలంగన్ జడుం
డై వర్తింతును మత్పురాచరిత పుణ్యశ్రీవిశేషంబునన్
భావంబందు వసింతువట్లగుటఁ గావన్ రావె సర్వాంతరా 57

మ॥ భవ! పద్మాప్తుఁడొకండయో క్షితినభో◆వ్యాప్తాంధకారంబు ద్రో
చి వెసన్ లోచనగోచరుండగుఁ గదా◆శ్రీకంఠ నీవన్నఁ గో
టివివస్వంత మహాప్రభాయుతుఁడవై◆ఠీవిన్ బ్రకాశింతు నా
యవివేకోగ్రతమంబుఁ బాపి తగఁ బ్ర◆త్యక్షంబుగా వే శివా! 58

మ॥ విలసత్పద్మవనిన్ మరాళమును బ్రా◆వృణ్మేఘమున్ జాతకం
బులు పద్మప్రియుఁ జక్రసంతతి శర◆త్పూర్ణేందుఁ జంద్రాతపం
బుల నిత్యంబుఁ జకోరపాళి యెటు ప్రా◆పుంగోరు నారీతిఁ గే
వలసౌఖ్యప్రదతావకీన చరణా◆బ్జంబెంచుఁ జిత్తంబు గిర్. 59

మ॥ వఱదన్ బోయెడువాఁడు తీరముఖమున్◆ బాంథుండు నీడన్ భయం
కర వర్షాచకితుండు గేహమును శీ◆కన్ సత్ప్రభున్ నిర్ధనుం
డరయం జీకటిఁ గుందుమానవుఁడు న◆త్యంతంబు దీపంబు నే
శరణంగోరునొయట్లు గోరెద మహే◆శశ్రీపదాంభోజయుగ్ముల్ 60

మ॥ నిజబీజావళి యూడుగున్, నదియు ము◆న్నీటిన్ లతల్ చెట్టు న
క్కజమారన్ సతినాథు సూదియునయ◆స్కాంతోపలం బెట్టు వొం
దఁ జనుం దద్గతిఁ గల్మషాపహ భవ◆త్పాదారవిందద్వయీ
భజనంబున్ మది వొందభక్తి యనఁజె◆ప్పం జెల్లు భూమండలిన్ 61

చ॥ శివ! ముదఖండ బాష్పములు◆ చేఁ బులకంబులు గల్గఁజేయు శౌ
చవిధిన నారతంబుఁ దగు◆ఛాదనముల్ బొనరించు వాగ్దర
ప్రవరమునన్ గథామృత ప◆రంపరఁ గ్రోలఁగనిచ్చు భూతిర
క్షవొనరఁ జేయు ధ్యానసుఖ◆శయ్యను బండఁగఁ జేయు భక్తిమా
త వివిధభక్తలోక శిశు◆తా జనపాళికభీష్టదాతయై 62

చ॥ చినిఁగిన పాతచెప్పు శశి◆శేఖరు బొమ్మలఁ జేరెఁ బుక్కిలిం
చిన యుదకంబు సాంబునభి◆షేచనమయ్యెను భక్తముక్తమై

తనరిన మాంసముగ్గ విందాకి నివేదనమయ్యె భక్తుండై
వనచరుఁడొప్పెఁజిత్రతర భక్తియు నేమియొనర్పదిమ్మహిన్ 63

మ॥ రవిజోరఃఫలకప్రతాడనము ఘోరంబౌనపస్మార భూ
తవినాశంబు నమత్సురావళి మహోద్యన్మౌళి సంఘర్షణం
బవనీభృద్వరభవ్యపర్యటనముల్ సాంబా! భవత్పాదుకా
వ్యవహారంబులు హీరపాదుకలుగా నస్మత్సంబెప్డుఁగొ
ల్చు విహారంబౌనటంచవే ఘనకృపాలోలా! భవానీ పతీ! 64

ఉ॥ ఏనరవర్యుఁడెప్పుడు మహేశపదాంబుజ సేవసేయు నె
వ్వానినిగాంచి దండిరాజనక్షముఁ వచ్చునటంచు నెమ్మదిన్
గ్లానివహించు వారి పటకంపములుగని దేవతావళుల్
మానితపాళి రత్నచయలాలితకాంతులఁ బూజసేయు న
వ్వానిని ముక్తికాంతవరభావమునన్ సుఖఁజేయు నిచ్చలున్

శా॥ లీలార్థంబుగ నీవు సర్వజగముల్ నిర్మింతు తన్మానవుల్
లీలామాత్రమ్ముగాళి: యెట్టికృతముల్ నేఁజేసినన్ నీకొగిన్
హాళింగూరుచుఁగాన నీవు కరుణాపాంగేక్షణశ్రీ ననున్
బ్రాతే యాచలకన్యకారమణ! ర్త్యవ్యంబు పాలింపఁగన్ 66

క॥ నానానందాశ్రుజలా, మానస్ఫుట పులకలక్షితోద్యద్భోగ
స్థానముముముక్షుసేవ్యం, బైనెగడెడు శైవభక్తి నారాధింతున్

క॥ అమిత ముదమ్మృతస్థానం, బమలభవత్పాదగోష్ఠమందెందు నెనం
గుమదీయభక్తిధేనువు, నమహేశా! పశుపతీక సంగోనుముకృపన్

చ॥ జలపశుత్వమున్ గుటిల◆చారత ఘోరకళంకితాదులన్
కలిగినవాఁడఁ గాను శివ!◆కల్గిన నీ తలమానికంబుగా
నలరినవాఁడ నౌదుఁ దుహి◆నాంశుఁడు దేశికదూరుఁడున్ గళం
కలసితుఁడున్ నిశాచరుఁడు◆గాఁడె శిరోమణిగా మహేశ్వరా!69

క॥ జగదధికుఁ బ్రభన్ను నిప్రభుగ నగణితఫలదాయకు సుమ◆హారాజవతం
సుఁ గలాఢ్యుఁడని లో వెలిగని గొలుతును స్వతంత్రబుద్ధి◆నిచ్చలు
శంభున్. 70

ఉ॥ భాసుర భావచాపమును◆భక్తిగుణంబున వంచి యుల్ల కై
లాస పతిస్మృతిప్రదర◆లాఘవ కేళిని పాపశత్రునం
తాపన మొనర్చి నెమ్మది ము◆దంబును బొంది సుధీవరుండు మా
హేశరమా విలాసము వ◆హించి చరించి సుఖించు నెంతయున్

చ॥ స్మృతిమహితాంజనంబున స◆శేషతమోవరణస్థలిన్ శివాం
చితబహునామమంత్రబలి◆చేఁ గడుఁ ద్రవ్వను రాశ్రితంబునన్
దతఫణిభూషితంబునగు◆నాగవిదారిపదోరుసన్నిధిన్
ధృతిమతులైన భక్తులు మ◆దింగని ధన్యతఁ బొల్తురిమ్మహిన్.72

శా॥ భూదారుండు రమేశ్వరుం డెరుదిదిన్◆మోహించి తానొందె నా
భూదారత్వము దానికంటెఁ గలదే?◆ముక్త్యోషధీరాజి న
త్యుదారంబగు పార్వతీశపద పం◆కేజాత సేవానగా
మోదంబొందుము నిష్కళంక మన మా◆ఫుల్లాంబుజాతోపమా!

క॥ ఆశాంబరు పాదాంబుజ మాశాక్లేశాదిదుష్ట◆మగు వాసనలన్
వాసితమగు హృత్పేటిక దా శుభ్రమొనర్చుఁగాక తలవాసనలన్

క॥ ధ్రువలక్షణాంచితము వేగవిలసితముఁ జిత్రగతియుఁ ♦ గల్యాణియు దో
షవిదూరముఁ జిత్తాశ్వము భవ! యధిరోహింపు వృషభ ♦ వాహా!
స్మరారీ! 75

చ॥ భవపద పుష్కరంబునన ♦ భక్తిఘనాఘన మాలతుష్టి వృ
ష్టి వెలయఁ జేయుచున్నదది ♦ చెల్వుగ నేని మనస్తటాకమం
దవిరతలీలఁ జెందునిల ♦ నా పురుషోత్తముజన్మసస్యముల్
విపులఫలించు సంతతము త్రీకవిలోచన! పాపమోచనా ! 76

చ॥ పతివిరహంబునన్ వనజ ♦ భామినిపోలె మదీయబుద్ధి యం
చితభవదీయ పాదసర ♦ సీరుహ సక్తి నినామమంత్రమున్
మతిజపియించి మోహమున ♦ నూసితకీర్తన దర్శనస్మృతుల్
సతమొనరించు సుస్థిరతఁ ♦ జక్కనఁ గూర్చుటకై మహేశ్వరా 77

చ॥ సదయ ! భవత్పదాబ్జపరి ♦ చర్యయొనర్చుటయందు శిక్షలోఁ
బాదలె విధేయతన్ దనరెఁ ♦ బొల్పుగు శుద్ధమనంబు నొందె, నీ
పదవనజాశ్రయంబుఁ గనె ♦ భావభవారి! మదీయబుద్ధి స
ద్విధి నొనరింపు దానికుప ♦ దేశము దేవ! సబోధకుంబలెన్. 78

ఉ॥ యోగిహృదబ్జసంచర ♦ యోగ్యము తావకపాద పద్మమో
భోగివిభూషణా! వికట ♦ భూరికఠోరము ధర్మరాజ వ
క్షోగురుపీఠిఁ దన్నుటనఁ ♦ గుందుమనంబు మృదుత్వశోభి ల
క్ష్మగణనీయ పాదసర ♦ సీజముఁ జూపుము చేత నొత్తెదన్. 79

ఉ॥ వీఁడిఁక బుట్టు, జాయినరి ♦ వీనిమవంబిఁ, క నుండఁగల్గు నా
కాడనటంచు నేఁ బుడమి ♦ యందు జనింపక మున్న కొండబల్
వాడలసంచరించు నల ♦ వాటొనరించితి కాక యుండినన్

మేడలుమిద్దెలుంబువుల♦మేలిమిపాన్పులు వేసులుండఁగాఁ
బోఁడిమిలేని ఆలపయిఁ♦బోవుచు నృత్యముసేయ నేటికిన్ 80

చ॥ భవ! భవదీయదివ్యపద ప♦ద్మసమర్చనఁ గొంతసేపు, భ
క్తి విశద భావతత్పర సు♦ఖిత్వమునందగఁ గొంతసేపు, త్వ
త్ప్రవిమల సత్కథాశ్రవణ♦తత్పరతన్మతిఁ గొంతసేపు, నీ
దవునుతిఁ గొంతసేపిటు ము♦దంచితబుద్ధిత్వ దర్పితంబు సే
యు వరమనుష్యుఁడే బ్రతికి♦యుండియుముక్తిఁ గేలాఁడిలాస్థలిన్

ఉ॥ బాణము వాహనంబుమఱి♦భార్యయు మృదంగవహుండు నెచ్చెలిన్
ఘోణియునై త్రివిక్రముఁడ♦కుంఠితభక్తిని నేత్రపూజయున్
రాణఁగలిర్పఁజేసి సుక♦రంబుగ మైసగ మొందె నట్టిఁడే
కాన నజాదిదేవతల♦కంటెను బూజ్యుఁడనంతుఁడయ్యెఁగా. 82

ఉ॥ పుట్టువు చావుగల్గి సుక♦ముల్ గనఁజాలని దేవతాళిఁ జే
పట్ట సుఖంబొకింత సుల♦భంబగునే? యజు నాంబునీశుఁ జే
పట్టి భజించువారలెయ♦భంగసుఖాంబుఝురీవిగాహమున్
గట్టిగఁగాంచువారలటు♦గావున శంకరుఁగొల్వు డెందమా! 83

మాలిని॥ అకలుషమతి కన్యన్♦ధ్యాతయుష్మత్పదన్ నీ
నికటమున భజింపన్♦నేనయిత్తున్ గృపన్ మా
మకహృదయ గృహాశ్రీ♦మన్ననన్ బొల్చుమీశా!
సకలభువన బంధూ!♦సచ్చిదానంద సింధూ!. 84

క॥ జలధిమథింపఁగఁజాలనతలమును భేదింపఁజాలఁ♦దగమ్మృగయా వీ
లల నెఱుఁగనశివసుమభూ షణపరిధానముల నెట్లొ♦సంగుదుమభవా!

శా॥ పూజాద్రవ్యసమృద్ధి కూర్పఁబడె శం♦భూ! దేవ! యట్లయ్యునే
యోజం బూజలొనర్తు దుర్లభము లై♦యొప్పారు క్రోడత్వముం
రాజద్దివ్యఖగత్వమున్ బడయఁగా♦నన్ నీశిరఃపాదముల్,
రాజీవాక్ష! విధుల్ గనన్ గలిగినా♦రా? వానినిక్కంబుగన్. 86

క॥ గ్రాసము విషము, కలాపము వాసుకి, వసనంబు తోలు♦ వాహనము
వృషం బోసాంబ! నీకుఁ గలవే మీ శక్తుఁడవౌన భక్తి♦ యేయివ్వు
కృపన్ 87

గీ॥ వారిధికిఁ గట్టఁగట్టిన♦ వాఁడనైనఁ బర్వతాధిపునడఁచిన♦ వాఁడనైన
బద్ధభవుఁ గూఁడ మించిన వాఁడనైన భవ! భవత్పూజవినుతిభా♦
వనలు సేతు. 88

క॥ నతులను నుతులను బూజల, స్మృతులను వలరెదవొ లేక♦ మేయాస్త్ర
శిలా
హతులను ముసలాహతులను, శితికంఠా! యలరెదవొ న♦చిం
పవె క్ష్వపతోన్. 89

గీ॥ ఈశ! యున్నతయోగంబు లెఱుఁగనేగు నుడులనీసత్కథావళి♦
నుడువుచుందు
నీశ్వరునినిన్ను నెడఁద భజించుచుందు శిరసుచేనంఘ్రులకు
నమస్కృతి యొనర్తు. 90

క॥ శితికంఠ! త్వత్కృపన్ హృద్గతతమము తొలంగె జ్ఞాన♦కాంతులు
వెలిఁగెన్
సతమును సంపత్కరము నుదతమోక్షాధారమగు ప♦దంబు భజింతున్

చ॥ విధిలిపిసూచకంబులును♦ భీతిదపాపకృతంబులైన దు
ర్విధియును దుఃఖపంకమవి♦వేకమహంకృతి దుర్వచస్సులున్

నదయ! భవత్కృపన్ దొలఁగె॥సారభవ త్కథ నాలకించుచున్
ముదమును గాంచునట్గని స॥ముద్ధరణం బొనరింపు శంకరా!

క॥ సోమకళాధర శిరమును; గోమల ఘనకంఠమునున॥ కుంఠము
గిరిజారామాభిరామ తేజము; మామకహృదయమున నిలుచు॥
మక్కువనెపుడున్ 93

ఉ॥ భర్గునిబల్కు నాలుకయు॥భర్గునిఁజూచెడు నేత్రపద్మముల్
భర్గుని బూజసేయు కర॥పంకజముల్ శివునెప్పుడున్ మనో
దుర్గనివాసుఁజేయు మహి॥తుండు కృతార్థుఁడుధన్యుఁడిమ్మహిన్
దుర్గనివాస! యాశ! నఖ॥ధూత విధాతృమహోత్తమాంగకా! 94

గీ॥ మత్పదంబులుమిగులఁగో॥ మలములకట! నీమనంబతి కఠిన మే
నేమిగతిని
నచటఁజరియింతునను సంది॥యంబువిడువు గిరులలో దేవిలోనెట్లు
దిరిగెదొకో 95

క॥ త్రిపురహర! మానసమద॥ ద్విపమును ధైర్యాంకుశమున
మేకొని నీ ది
వ్యపదాలానమునందున్ గృపమైఁగట్టఁగదె భక్తి॥శృంఖల
చేతన్. 96

క॥ పరమశివ! నమదమును నుద్ధురమగు హృదయ కరిచెలఁగి॥
తొరవు గతులన్

జరియించు నలుగడల భక్తిరజ్జువున దానిఁగట్టు ◆ తిరముగ
నుండఁ. 97

చ॥ లలితసువర్ణయుక్త పద◆లంకృతి శోభిత, సాధువృత్త, మం
జులపద సంయుతన్ సుగుణ◆సుందర లక్షణ లక్షితన్ సము
జ్జ్వల మహితార్థ రేఖయు ల◆సద్వినయాభరణన్ శివా! సుధీ
కులనుతఁగొమ్ము మద్రుచిర◆కోమలకావ్యవధూలలామమున్.98

చ॥ భవ! భవదీయశీర్షమున◆బాదములన్ గన బ్రహ్మవిష్ణువుల్
భువిని మరాళఘోణివపు◆వుల్ ధరియించి దివిన్ భువిన్ జరిం
చి విఫలయత్నులైరి శశి◆శేఖర! నేనన నెంతవాఁడ నీ
యవిరళ సత్కృపాఘన క◆టాక్షములన్ బ్రసరింపు నాపయిన్ 99

ఉ॥ దేవ! విధాతృముఖ్యులు మ◆దిన్ స్తుతిపాత్రులనందఱన్ రహిన్
భావనసేయునప్డు నినుఁ◆బ్రథముండని మౌన్నిరీశ్వరుం
డే వర దైవతంబొ యని◆యెంచుటయందు నిన్నున్ యథార్థఁగా
భావనసేసిరే నమృష◆వల్కను నిక్కువ మిద్ది శంకరా! 100

మ॥ సుకవిస్తోమ మనఃప్రమోదకరమై◆సూక్తిప్రభావప్రకా
శకలాపంబయి భక్తిసౌరభనిధా◆నంబైయు మానాథది
వ్యకథోద్యాన పరిస్థితంబయి యఖం◆డామేయ దివ్యత్ఫల
ప్రకరంబీకృతి పారిజాతమును దృ◆గ్రమ్యంబుగాఁ బొల్చుచున్.

తే॥ గీ॥ విబుధ జనములచేత సే◆వితము నగుచు
భక్తలోకంబునకు శుభ◆ప్రదము నగుచు

శ్రోతలకు వక్తల కభీష్ట దాతయగుచు
ధరణి వెలయుత మాచంద్ర తారకముగ

మ॥ తనుఁగన్నట్టి యశశ్శరీరునకు విద్యారత్నవారాశికిన్
జన సన్మాన్య విశుద్ధవర్తనున కంచత్సత్కృపా రాశికిన్
ఘనకీర్తిన్ భువి నిల్పఁగోరి శివ భక్తశ్రేష్ఠ కోదండ రా
మునకున్ భక్తజనాళిధామునకు బెంపున్ సొంపునిండారఁగన్.

క॥ సోమంచి వంశజలనిధి
సోముఁడు కోదండరామ సుతుఁడతుల యశో
ధాముండా రాధిత శ్రీ
రాముండిది వాసుదేవ రాయఁడొనర్చెన్.



శ్రీకాకుళం శ్రీరామకృష్ణ ముద్రణాలయమున ముద్రితము.